
లీలామానుష వేషధారియగు
శ్రీకృష్ణ భగవానుని
లీలలు అనంతములు.
అందు తెరకెక్కించిన
వెన్నోవున్నా, ఎక్కించనివి
ఇంకెన్నోవున్నాయి. ఆ వున్న
వాటిలో మధురాతి మధుర
ములైన రసవత్తర ఘట్టాలను
ఎన్నిక చేసి పర్చికూర్చిన
చిత్ర విచిత్రమైన కథే
శ్రీకృష్ణవిజయము
చిత్ర కథ
—మల్లెమాల

# నటులు



## నటరత్న, పద్మశ్రీ యన్. టి. రామారావు

## నట సార్వభౌమ యస్. వి. రంగారావు

కాంతారావు, నాగభూషణం, రామకృష్ణ, పద్మనాభం, సత్యనారాయణ, మిక్కిలినేని, రాజనాల, ప్రభాకర రెడ్డి, ధూళిపాళ, త్యాగరాజు, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, కె. వి. చలం, డా॥ శివరామకృష్ణయ్య, అర్జా జనార్దనరావు, శ్రీకాంత్, మద్దాలి కృష్ణమూర్తి, కాశీనాథ్ తాత, నాగరాజు, డా॥ శేషాచలం, శీతారాం, ఏచూరి, ముంగర, వంగర, వడ్లమాని, కృష్ణారెడ్డి, కె. పి. మోహన్ మొదలగువారు.

ఛ(ర నాకరు

~, ుయక,

# నటీమణులు



## జయలలిత, దేవిక,

రమాప్రభ, ఇందిర, జయశ్రీ, కనకదుర్గ, ప్రసన్నరాణి,
సవిత, సుమిత్ర, ఝాన్సీ, మీనాదేవి, పద్మిని, భవాని,
శాంత, విజయశ్రీ, జయవిజయ, సచ్చు, ఉదయ చంద్రిక,
జూ॥ శ్రీరంజని మొదలగువారు:

అతిథి నటి:

## హేమ మాలిని

మరియు

సత్యభామగా

## జమున

# సాంకేతిక నిపుణులు

—:o:—

| | | |
|---|---|---|
| కథ, చిత్రానువాదం | : | మల్లెమాల |
| మాటలు.... .... | : | పింగళి |
| పాటలు .... | : | పింగళి, ఆచార్య ఆత్రేయ, డా॥ సి. నారాయణరెడ్డి, దాశరథి, ముదివర్తి కొండమాచార్య, & మల్లెమాల. |
| పద్యాలు .... | : | మల్లెమాల, ముదివర్తి కొండమాచార్య |
| నేపథ్య గానం .... | : | పద్మశ్రీ ఘంటసాల, సుశీల, జానకి, మాధవపెద్ది సత్యం, పిఠాపురం. |
| ఛ [illegible] హణం .... | : | పి. ఎల్లప్ప |
| తా [illegible] ఛాయాగ్రహణం | : | డబ్ల్యు. ఆర్. సుబ్బారావు |
| క [illegible] .... | : | గోఖలే |
| కు [illegible] .... | : | బి. గోపాలరావు |
| నృ [illegible] .... | : | వెంపటి చిన సత్యం |
| దుస్తులు .... | : | టి. యస్. రామమూర్తి, జి. శ్రీనివాస్ |
| ఆభరణములు .... | : | పార్థసారధి, రాజాబహదూర్ సర్ణ |
| మేకప్ .... | : | పీతాంబరం, సురేష్, రవి గోపాల్, వీర్రాజు, భద్ర నాకరు మాధవరావు, జయకృ |

| | | | |
|---|---|---|---|
| స్టిల్సు | .... | : | చిట్టిబాబు, శ్యామ్‌కుమార్ |
| పబ్లిసిటి | .... | : | S. V. చలపతిరావు, ఈశ్వర్. |
| ప్రెస్ పబ్లిసిటి | .... | : | విజయపబ్లిసిటీస్ (విజయవాడ) |
| ప్రెస్ రిలేషన్ | .... | : | శ్రీకృష్ణ |
| శబ్దగ్రహణం | .... | : | కె. ఆర్. రామస్వామి(ప్రసాద్) |
| | | | స్వామినాథన్(విజయాగార్డెన్సు) |
| నిర్మాణ నిర్వాహకులు | | : | యస్. వెంకటేశ్వరరెడ్డి, |
| | | | జి. రమణారెడ్డి, టి. రమణారెడ్డి |
| సహాయ దర్శకులు | | : | యస్. ఆర్ కమలాకర్ B.A., |
| | | | జి. శ్రీనివాస్ |
| సహకార దర్శకుడు | | : | వై. ఈశ్వర రెడ్డి B. A., |
| స్టుడియో | .... | : | ప్రసాద్ |

సంగీతం : **పెండ్యాల**

దర్శకత్వం :

**కమలాకర కామేశ్వరరావు B. A.**

నిర్మాత

**యం. యస్. రెడ్డి**

:పంపిణీదారులు:

| | |
|---|---|
| ఆంధ్ర: | విజయా కంబైన్సు, |
| సీడెడ్: | జయలక్ష్మి పిక్చర్సు, |
| నైజాం: | దివ్యదత్తా ఫిలిమ్సు, |
| మైసూరు: | సుధాచిత్ర, |
| స్సా: | రేవతి పిక్చర్సు. |

# మహోదర శపథం

అది కాలయవనుని బహిరంగసభ:

సచివ సామంత హిత పురోహిత బృందంతో క్రిక్కిరిసి ఉంది. “హూరే హూరే ఆఃహూరే! ధీరాంతక కాలాంతక కాల యవన సమ్రాట్టుకీ, హూరే హూరే ఆహూరే” అంటూ వందిమాగధులు స్తోత్ర వచనములు పఠించుచూ వెంటరాగా, అరివీర భయంకరుడైన కాలయవనుడు సభను ప్రవేశించాడు. సభాసదులందరూ ఒక్కుమ్మడిగా పైకి లేచి జయజయ ధ్వానాలతో స్వాగతం పలికారు. కాలయవనుడు ధీరగంభీర వదనుడై సింహాసనాన్ని సమీపించాడు. అచ్చట జిలుగు వెలుగులు విరజిమ్ముచూ, దగద్ధగాయమానంగా మెరిసిపోతున్న ఒక పీఠాన్ని చూశాడు. తమ్ముడు మహోదరుని వైపు తిరిగాడు.

“సహజా! కాలికడ్డుగా ఏమిటిది?....” అంటూ గంభీరంగ ప్రశ్నించాడు.

మహోద[illegible] ఖ యువరాజు అన్నివిధాలా అన్నకు దీటైన వాడు. అన్న[illegible] నందుకుని ఇలా అన్నాడు:

“నీవు [illegible] ఘూర్జర గాంధారముల కొల్లగొట్టి ఆ రాజుల చెరపట్టి తెచ్చి[illegible] నేను వారి కిరీటముల చెడగొట్టి ఆ సువర్ణ మణి రత్నముల [illegible] జిరకే చేయించాను ‘పాదపీఠి!’.”

ఎంత వీరోచి[illegible] అన్నట్లు సభికులందరూ ఒకరినొకరు చూచుకొన్నారు.

కాలయవనుడు తమ్ముని ధీరోదాత్త సంకల్పాన్ని అభినందించక పోగా....

"ఆఃహాం! రే సహజా! నా ప్రతాప చిహ్నం ఈ చేవయే లేని, చావనూ లేని జడ పదార్థమా?....ఛీ....కండలు తిరిగి మెండుగ బలిసి పోతరించి పొటకరించిన ప్రతి వీరుని వీపు నా పాదపీఠికావలె! పాదమూనగనే వాని వెన్నెముక ఫెళ ఫెళ విరుగవలె'...."

—అంటూ గర్జించాడు.

ఆ గర్జనకు సభ దద్దరిల్లింది. సభాసదులు మళ్ళీ ఒకరి నొకరు చూచుకొన్నారు. కాలయవనుడు సింహాసనాన్ని అధిష్టించాడు.

ఇంతలో—

సమస్త రాజ లాంఛనాలతో సపరివారంగా సాత్యకి సభలో ప్రవేశించాడు.

శ్రీకృష్ణవాసుదేవుని సోదరుడనని తన్ను తాను పరిచయం చేసుకున్నాడు. రాయబారిగా వచ్చానంటూ బహువర్ణ చిత్రితమైన ఒక కలశమును కాలయవనునకు సమర్పించాడు!

కాలయవనుడు వెటకారంగా నవ్వి—

"ఓయ్! నీ సోదరుడు కదనమున మమ్మెదుర్కొనలేక కాళ్ళ బేరమునకు పంపెనా నిన్ను!...." అన్నాడు.

"కాదు! కదనమే సంభవించిన ఒక్క నీ తల తెగుటతో మాత్రమే సరిపోదు! నీ దురదృష్టంతో ముడిపడిన అమాయకుల తలలు ఎన్నో తెగి గుట్టలు పడవలసివస్తుంది. అమాయక జన నష్టం మా కిష్టంలేదు!" సగర్వంగా సమాధాన మిచ్చాడు సాత్యకి.

"అందుకని, మమ్ము చల్ల బరచుటకు చల్ల కుండ లంచముగా పంపెనా!....కుడిభుజం! అందేమున్నదో చూడు!" అంటూ కాల

యవనుడు అమాత్యుని ఆదేశించాడు. కుడిభుజం కలశం మూత విప్పాడు. వెంటనే అందుండి ఒక కాలసర్పం సర్రున పైకి లేచి, పడగ విప్పి బుస కొట్టసాగింది. అంతా దిగ్భ్రాంతితో చూస్తున్నారు!

కాలయవనుడు కనుబొమలు చిట్లించి;

"అర్భకా! ఈ విషపురుగు నిలా పంపుటలో ఏమిటా శ్రీకృష్ణుని ఉద్దేశం?" అంటూ హూంకరించాడు.

"ఏమిటా? శ్రీకృష్ణునితో కయ్యాట, కాలసర్పంతో చెలగాట! అని నీకు తెలియజెప్పడమే!...."

"సరిసరి! చెప్పావుగా, ఇక వెళ్ళు. మా సమాధానం నా సహజుడు నీ సహజునకు నేరుగా తెలియజేయగలడు!" అన్నాడు కాలయవనుడు.

అన్న విధంగానే, తమ్ముడు మహోదరుని ద్వారా, శ్రీకృష్ణునకు తన ప్రతి హెచ్చరికను పంపాడు!....ఏమని?

"కృష్ణా! కాలకంఠ వరప్రసాదియైన కాలయవనుని చెనకడం నీ తరంకాదు! సర్వయాదవ జాతిని సమూలంగా నాశనం చేయడం తథ్యం! సిద్ధంగా ఉండండి!" అని.

నిండుపేరోలగంలో కొలువున్న శ్రీకృష్ణునకు కాలయవనుని హెచ్చరికను అందజేశాడు మహోదరుడు.

'చూస్తాంగా!' అన్నట్లు హేళనగా తలపంకించాడు శ్రీకృష్ణుడు.

మహోదరుడు ఒక్కసారి సభనంతా తేరిపార జూచి దిక్కులు పిక్కటిల్లునట్లు సింహగర్జనచేసి వెళ్ళిపోయాడు!

"కృష్ణా! ఆ వరమేమిటి? వాడి అహమేమిటి?" బలరాముడు తమ్ముని ప్రశ్నించాడు.

# 10

"బావన్నయ్యా! కాలయవనునకు యాదవుల చేతిలో చావు లేదు! అది ఈశ్వరుని వరం! మీరు నగర సంరక్షణలో అప్రమత్తులై ఉండండి! వాడి పని నేను చూస్తాను!...." అంటూ శ్రీకృష్ణుడు పైకి లేచాడిక్కడ.

"ఒకేమాటు ఆ శ్రీకృష్ణుని వంశం, కులం సమూలంగా కావలె సర్వనాశనం! మ్రోగించండి రణభేరి" అంటూ కాలయవనుడు తమ్ముని ఆదేశించాడు అక్కడ.

"హరహర మహాదేవ! కానిపనికి కామాటం మెండని ఏమిటీ ఆర్భాటం!...." అంటూ సభలో ప్రవేశించాడు నారదుడు.

"ఆర్భాటం కాదు నారదా! ఆక్రోశం!"

"ఏక్రోశమైనా శ్రీకృష్ణుని కోసమేగా! అతడిప్పుడు ద్వారకలో లేడు. నీ ధాటికి భయపడి రైవతకాద్రిలో తలదాచుకుంటూ ఒంటరిగా ఉన్నాడు!"

"అయితే అక్కడికే నడుపుదాం సైన్యాన్ని!" అన్నాడు మహోదరుడు.

"సహజా! ఎరుగవా వీర లక్షణం! ఒంటరివానితో పోరుటకు ఒంటరిగానే పోవలె. నా చేతిలో ఆ తుంటరి కృష్ణుడెంత? నే వెళ్ళి హతమార్చి రేపీపాటికి తిరిగి వస్తాను. నీవు విజయోత్సవానికి ఏర్పాట్లు చేయించు' అని అనుజన్ముని కాదేశించి, రైవతకాద్రికి బయలుదేరాడు కాలయవనుడు.

తన పాచిక పారినందుకు తనలో తానే మురిసి పోయాడు నారదుడు.

విజయలక్ష్మీ సమేతుడై అరుదెంచే అన్నకు ఘనంగా స్వాగతమిచ్చేందుకు అన్ని ఏర్పాట్లు పూర్తిచేశాడు మహోదరుడు.

## 11

ఆ ఆనందలో నేనూ పాలుపంచుకుంటానంటూ అక్కడే తిష్టవేశాడు నారదుడు. విజయోత్సవ లగ్నమాసన్న మయింది. కానీ, కాలయవనుడు తిరిగి రాలేదు.

వచ్చింది వాని చితా భస్మం మాత్రమే....! మహోదరుని ఆవేశానికి అంతులేదు! వానిలో ప్రతీకారేచ్ఛ పరవళ్ళు త్రొక్కింది. ప్రళయకాల రుద్రుడై ఆర్భటించాడు.

"నారదా! ఈ దారుణము నేను భరించజాల. కపటోపాయంతో నా అన్నను పొట్టపెట్టుకొన్న ఆ మాయావిని మట్టు బెట్టిన పరక్షణముగాని నా పగ చల్లారదు. ఎంతకాలము చెల్లిన చెల్లుగాక! ఎన్ని ఆటంకములు వచ్చిన వచ్చుగాక! సంకుల సమరమున ఆ యాదవాధముని హతమార్చి, వాని అంగాంగములను ఖండ ఖండములుగా ఖండించి, పొంగిన రక్త నాళములను త్రెంచి, ఆ రుధిరధారలతో నా అగ్రజునికి తర్పణ గావించెద. ఇదే నా ప్రతిజ్ఞ!...."అంటూ భయంకర శపథంచేశాడు.

ఆ తర్వాత ఏమయింది!

యాదవుల చేతిలో చావులేని కాలయవనుని శ్రీకృష్ణుడు ఎలా సంహరించాడు?

మహోదరుడు చేసిన ప్రతిజ్ఞను ఎంత వరకు చెల్లించుకోగలిగాడు?

సమాధానం తెరమీద లభిస్తుంది.



# దీపావళి

లోక కంటకుడయిన నరకాసురుని సంహారించుటకై శ్రీకృష్ణుడు సత్యభామా సమేతంగా యుద్ధానికి వెళ్ళాడు. నరకాసురునకు శ్రీకృష్ణునకు హోరాహోరీగా ఘోర సంగ్రామం జరిగింది. అప్రతిహత పరాక్రమవంతుడు, అమోఘశక్తి సంపన్నుడు ఐన నరకాసురుడు శ్రీకృష్ణుని మూర్ఛిల్లజేశాడు.

వెంటనే సాత్రాజితి విల్లందుకున్నది. వీర రసాధి దేవతయై ధనుష్టంకార మొనర్చినది. పుంఖాను పుంఖములుగా బాణాలను గుప్పించినది. ఆ శస్త్రధాటి కాగలేక నరకుని సైన్యం హాహాకారాలు సలుపుతూ పలాయనం చిత్తగించింది. సత్యభామ వీర విజృంభణకు నరకుడు విస్తుపోయాడు. చేష్టలుడిగి తదేకంగా ఆమెవైపే చూస్తూ నిలుచున్నాడు.

ఇంతలో శ్రీకృష్ణుడు మూర్ఛదేరాడు. నరకాసురుడు అది గమనించాడు.

"కృష్ణా! భామను చాటు చేసుకుని రణరంగభూమిలో నిల్చుటకు నీకు సిగ్గులేకపోవచ్చు. ఆడుదానిపై నేనేమని బాణ మేయగలను? లెమ్ము-నీ కోమలి చేతి విల్లు గైకొమ్ము మమ్మెదుర్కొన రమ్ము." అంటూ సవాలు చేశాడు.

"సత్యా! వింటివా వాని ఘోష. పాపం ఆడుదాని చేతిలో చచ్చినాడన్న అపఖ్యాతి తన కంటకుండా చూడమని అంగలారుస్తున్నాడు. ఎందుకు కాదనాలి. నేనే సంహరిస్తాను-" అంటూ శ్రీకృష్ణుడు సుదర్శన చక్రం ప్రయోగించాడు.

అది అరుణకాంతులు విరజిమ్ముచూ వెళ్ళి నరకుని కంఠం

ఖండించింది. దుర్మార్గుడయిన నరకుని పీడ వదిలినందుకు అఖిల లోకములు ఆనంద దీపావళి జరుపుకున్నవి.

దేవలోకంలో శ్రీకృష్ణునకు అభినందన సభ యేర్పాటు చేశాడు దేవేంద్రుడు.

జోహారు శిఖిపింఛమౌళీ: ఇదె!

జోహారు రసరమ్యగుణశాలి! వనమాలి.

అంటూ శ్రీకృష్ణుని గుణగణాలను స్తుతిస్తూ రంభ నృత్యం ప్రారంభించింది. మృదుమధురగానంతో మనోహర లాస్యంతో సభికులను మంత్రముగ్ధుల్ని చేసింది.

నృత్యం పూర్తికాగానే కరతాళ ధ్వనులతో సభ మారు మ్రోగింది. జగత్పీడాకరుడైన నరకుని సంహరించి ఎల్లలోకములకు స్థిరశాంతి భద్రతలు ప్రసాదించితివని దేవేంద్రుడు ముకుందుని శ్లాఘించాడు.

"మహేంద్రా! అట్లనకు. ఈ శాంతిభద్రతలు తాత్కాలికమే" అన్నాడు నారదుడు.

ఆ మాటకు దేవేంద్రుడు చకితుడైనాడు.

"మహర్షి ఏమంటిరి?" అన్నాడు.

"ఉన్నమాటే! నరకాసురుని మించిన లోక కంటకుడు మరొకడు తయారయ్యాడు."

ఎవరది? అన్నట్టు శ్రీకృష్ణుడు ప్రశ్నార్థకంగా నారదునివైపు చూచాడు.

"ఆ కాలయవనుని తమ్ముడులేడూ, మహోదరుడు. వాడు తన తపశ్శక్తిచే శివుని మెప్పించి అనేక అమోఘాస్త్రములను పొందాడు. అంతేగాదు.

పంచభూతములలో ఏ భూతముచేతనూ—

ఖచర భూచర జలచర జంతు జాలములో ఏ జంతువు చేతనూ—

కాలకూట కాకోలాది మహావిషమ్ములలో ఏ విషముచేతనూ-

నరసురాసుర గరుడోరగ యక్ష గంధర్వ కిన్నర కింపురుషులలో ఏ పురుషుని చేతనూ—

స్త్రీ చేతనూ—

పరులచే ప్రయోగింపబడు ఏ మారణాయుధము చేతనూ చావులేకుండా వరములు గైకొన్నాడు. ఏనాటికైనా మిమ్ము సాధించి తీరుతానని భీకర ప్రతిజ్ఞ చేశాడు" అని చెప్పవలసినదంతా చెప్పాడు నారదుడు.

ఆందోళనగా కృష్ణునివంక చూచాడు దేవేంద్రుడు.

"మహేంద్రా! కలత పడకు. ఇదివరకు ఎందరిట్టి వరాలు పొందలేదు, ఎన్ని దురాగతాలు గావించలేదు. వారందరిగతీ ఏమైనది? వీడి గతీ అంతే! పాపం పండనివ్వండి" అని శ్రీ కృష్ణుడు అభయమిచ్చాడు.

మహేశ్వర వరదర్పితుడైన మహోదరుడు ఆ తరువాత ఏం చేశాడు? వాని పాపం ఎలా పండింది?..వెండితెర జవాబిస్తుంది...

———

# బ్రహ్మ రహస్యం

అది రుక్మిణీదేవి మందిరం.—

ఒక్క సత్యభామ తప్ప, శ్రీకృష్ణుని దేవేరులందరూ వున్నారు. ముత్యాల ముగ్గులతో, పచ్చల తోరణాలతో భవనమంతా శోభాయమానంగా అలంకరించబడి వుంది. అయినా— రావలసినంత అందం రాలేదని గాబోలు, కావలసినంత పరిజనమున్నా, రాణులే స్వయంగా తుదిమెరుగులు దిద్దుచున్నారు. ఏమిటో విశేషం? ఎందుకో ఆ సంరంభం?

నరకాసుర సంహారానంతరం విజయోత్సాహంతో తిరిగివచ్చే ప్రాణపతిని సముచితరీతిని సత్కరించాలని పత్నులందరూ ముచ్చట పడ్డారు. అదే విశేషం! అందుకే ఆ సంరంభం!

రుక్మిణీదేవి ఏర్పాట్లన్నీ ఒక్కసారి పర్యవేక్షించింది. "చతురికా! వనమాలెక్కడ? స్వామి ఏ క్షణాన వచ్చినా రావచ్చు" అనింది పరిచారిక నుద్దేశించి.

"అక్కా! నీ పిచ్చిగాని వారు ఈ రోజు మాత్రం వస్తారని నమ్మకమేమిటి?" అన్నది జాంబవతి తన సహజధోరణిలో.

"ఎలా వస్తారూ?....సంహరించిందా మహావీరుడైన నరకాసురుణ్ణాయె! సత్కారాలా దేవలోకంలో నాయె! ఆ ఆనందంలో పాలు పంచుకునేందుకు ముద్దుల భార్య "సత్యాదేవి" వద్దనే వుందాయె! ఇక....వారికి నువ్వూ నేనూ జ్ఞాపకం వస్తామా?" అంటూ సత్యభామ మీదగల అక్కసంతా వెళ్ళగక్కింది లక్షణ.

"లక్షణా! ఏమిటా మాటలు! స్వామి ఏ పనిజేసినా సకారణంగానే చేస్తారు...." అని రుక్మిణీదేవి అంటూ ఉండగా....

# 16

"ఆహా! కృష్ణ తత్వం ఎంత బాగా జీర్ణించుకున్నావు తల్లీ!" అంటూ లోనికి వచ్చాడు నారదుడు. మహాత్ములు వూరక రారుగా!....అతిలోక సుందరమైన ఒక అమ్మాయిని వెంట బెట్టుక వచ్చాడు. ముగ్ధమోహనమైన ఆ చిన్నారి సౌందర్యానికి అందరూ అచ్చెరువొందారు.

"మునీంద్రా! ఎవరీ చిన్నారి? చాలా ముచ్చటగా ఉంది...." అన్నది రుక్మిణి.

"ఏం చెప్పమంటారు? ఈమె పేరు వసుంధర. విధివశాత్తు యీ కన్యకామణికి నేను పాలక జనకుణ్ణి కావలసివచ్చింది...." అన్నాడు అతివినయంగా నారదుడు.

"మంచిదేలెండి! సంసార జంజాటం కాస్త మీకు కూడా తెలిసివస్తుంది...." అని చమత్కరించింది లక్షణ.

"కాస్తేమిటి? ఘనంగానే తెలిసొచ్చేట్టుంది. ఈ పిల్లకు ఐన భర్తను వెదకి పెళ్ళిచేసే లోపల...."

'ఎక్కడో వెదకడమెందుకు జనకా!....ఇక్కడ దొరకరా ఐన భర్త!....' అంటూ అమాయకంగా నారదుని వైపు చూసింది వసుంధర.

'చూశారా! ఎంత అమాయకురాలో....ఈ బేలను ఒంటరిగా ఎక్కడ విడిచి వెళ్ళడం! తల్లీ రుక్మిణీదేవి! నీకు పుణ్యముంటుంది. నేను వరనిర్ణయం చేసుక వచ్చే వరకూ ఈ కన్యకు మీ చాటున కాస్త చోటివ్వాలి. తప్పదు' అని ప్రాధేయ పడ్డాడు నారదుడు.

'దానికేం మునీంద్రా! కానీ....ఇంత అందగత్తెను, అవివాహితను నా మందిరంలో వుంచుకొని కాపాడ్డమంటే....' అని రుక్మిణీదేవి ఏదో సందేహం వ్యక్తం చేయబోగా నారదుడు వారించి—

ఏమిటో!...... అంతావింతగా ఉంది



## 17

'మీ అనుమానం నాకర్థమైంది. మీ కొాక బ్రహ్మ రహస్యం చెప్పాలి. ఇలా దయ చేస్తారా?....' అంటూ ప్రక్క గదిలోకి దారి తీశాడు. రుక్మిణి వారి ననుసరించింది.

'ఏమిటో ఆ బ్రహ్మ రహస్యం?....' అంటూ రాణులందరూ ఒకరి నొకరు చూచుకున్నారు.

'మీకు తెలియదా?....' అంతులేని ఉత్సాహంతో ప్రశ్నించింది వసుంధర-తనకు తెలుసునన్న ధోరణిలో.

'నీకు తెలుసునా?' అన్నది భద్ర.

'నాకా!...తెలియదు...తెలియదు...' ముక్తసరిగా జవాబిచ్చింది.

'అది సరేగాని—నీ పేరేమన్నావ్?....' అన్నది కాళింది.

'నేననలేదే...'అంటూ సాలోచనగా పైకి చూసింది వసుంధర.

'ఊం! గడుసుదానివే....' అంటూ అంతా గొల్లున నవ్వారు. వాళ్ళెందుకలా నవ్వుతున్నారో వసుంధర కర్థంగాలేదు. ఎందుకైనా మంచిదని తానూ నవ్వింది. మందిర మంతా నవ్వులతో నిండిపోయింది.

నారదుడు బ్రహ్మ రహస్యాన్ని రుక్మిణి చెవిలో ఊదాడు.

'ఇక మీరెప్పుడొచ్చినా ఫరవాలేదు!....' అన్నది రుక్మిణి. మందిరంలో నవ్వులు కొనసాగుతూనే ఉన్నాయి. రుక్మిణీ, నారదుడు వచ్చారు.

'ఆం! ఇలా మీరూ-మీరు కలుపుగోలుగా వుండడమే నాకు కావలసింది....' అంటూ బంధుత్వం కలిపేశాడు నారదుడు.

'వసుంధరను లోనికి తీసుకెళ్ళి ఏం కావాలో చూడు!' అని చతురిక నాదేశించింది రుక్మిణి.

'వెళ్ళదునా జనకా!....' అన్నది వసుంధర నారదుని వైపు గోముగా చూస్తూ.

'వెళ్ళమ్మా! చెప్పానుగా...ఇక్కడ నీకే లోటు ఉండదని....'

'ఔనౌను....చెప్పారుగా....వెళ్ళేదను-వెళ్ళేదను' అంటూ చతురిక వెంట వెళ్ళింది వసుంధర.

ఇంతలో—

దుందుభి శబ్దం వినిపించింది. అందరూ స్వామి వస్తున్నారు-స్వామి వస్తున్నారు-అంటూ సంబర పడసాగారు.

'తల్లీ! ఇక నాకు సెలవు!' అంటూ నారదుడు ఆదుర్దాగా మహతి చేతికి తీసుకున్నాడు. రుక్మిణి అది చూసి—

'మునీంద్రా! అదేమిటి? ఇంత సేపూ వుండి, తీరా స్వామివారు వచ్చే వేళకు వెళ్తానంటారు!' అన్నది.

'అయ్యయ్యో! నామాటకేం! ముందు అమ్మాయి సంగతి చూడండి. స్వామివారు వసుంధర కంట పడరాదు. అది ముఖ్యం....' అన్నాడు కంగారుగా నారదుడు.

'ఔనౌను. అది ముఖ్యం....' అన్నది రుక్మిణి, మరింత కంగారుగా.

'అదే ముఖ్యం....' అన్నారు రాణులు.

'ఇది కూడా ముఖ్యమే!' అన్నట్టు తంబుర భుజాన వేసుకొని హడావుడిగా దౌడు తీశాడు నారదుడు.

శ్రీకృష్ణుని ఆగమన వార్త చెవిని బడగానే నారదుడెందుకంత కంగారుగా బయలుదేరాడు?

ఇంతకూ ఎవరీ వసుంధర?

ఆజన్మ బ్రహ్మచారి అయిన నారదుడామెకు పాలక జనకుడు కావడమేమిటి?

వసుంధరను ప్రత్యేకంగా రుక్మిణీదేవికి అప్పగించడంలో నారదుని ఉద్దేశమేమిటి?....ఆ బ్రహ్మ రహస్యమేమిటి?....

ఏమైనది....చిత్రం చూసి తెలుసుకోండి.

———

# "సమయ సంజీవి"

విమానంలో హిమాలయాల మీదుగా పయనిస్తున్న మహోదరుడు అచ్చటి సానువులలో విహరిస్తున్న ఒక అందాల బాలను చూశాడు. అరవిరిసిన పరువంతో, అంతులేని ఉత్సాహంతో ఆడుతూ-పాడుతూ ప్రకృతినే పరవశింప జేస్తున్నదా చిన్నారి. అంత మంచి చిన్నది ఒంటరిగా కంటబడితే వెంట బడకుండా ఎవడూరుకుంటాడు? విమానం క్రిందికి దింపి మహోదరుడామెను సమీపించాడు. ఆ సుందరి పారిపోలేదు. అదురూ బెదురూ లేకుండా అలాగే నిల్చుని ఏదో వింత జంతువును చూసి నట్లు మహోదరుని ఆపాదమ స్తకం అదే పనిగా చూడసాగింది. అదంతా తన మీది వలపేనని భావించాడు మహోదరుడు. ఆమెను చెరబట్ట బుద్ధి పుట్టలేదతనికి. శాశ్వతంగా తన దాన్ని చేసుకోవాలనుకున్నాడు. ఆ మాటే ఆమెతో అన్నాడు. 'ఓయ్-ఓయ్! నా జనకుడున్నాడు. అడగాలి....' అన్నదామె చిలిపిగా.

'అడగడమేమిటి? అవసరమైతే ప్రాధేయ పడతాను. ఎక్కడున్నాడో చెప్పు?'

'వారిక్కడ లేరు. ఎప్పుడో వస్తారు....'

'సరి-సరి నీ మనసు తెలుసుకొన్నాను. నా పేరు మహోదరుడు. యవన సమ్రాట్టును. నీ జనకుడు రాగానే చెప్పు- వెంటనే వచ్చి నా గృహం పావనం చెయ్యమన్నానని. అన్నీ నే జూచుకుంటా!' అని చెప్పి మహోదరుడు అటనుండి వెళ్ళిపోయాడు.

మందిరం చేరాడన్న మాటేగాని మహోదరుని మనసు మనసులో లేదు. కాబోయే మామగారి రాక కోసం ఒళ్ళంతా కళ్ళు జేసుకొని ఎదురు చూస్తున్నాడు. కానీ రావలసిన వ్యక్తి రాలేదు. క్షణమొక యుగంగా వున్నదతనికి. ఇంతలో నారదుడు వచ్చాడు.

జరిగినదంతా చెప్పాడు మహోదరుడు ఆ పిల్ల ఎవరో నిన్ను మోసం చేసి పోయిందన్నాడు నారదుడు. అలా జరగడానికి వీల్లేదనీ, ఆమె తన్నెంతంగా ఆకర్షించిందో, తనూ ఆమెనంత గానే ఆకర్షించానని చెప్పాడు మహోదరుడు. 'అయితే ఇంకేం! అన్వేషణ ప్రారంభించండి!' అన్నాడు నారదుడు. ఆనవాళ్ళన్నీ నారదునకు జెప్పి, ఆ పనికి మీరే పూనుకోవాలని ప్రాధేయ పడ్డాడు మహోదరుడు. నీ పని ముగిసే వరకూ వేరే పని చూడ నని అభయమిచ్చి ఎకాయెకిని బయలుదేరాడు నారదుడు.

ఇచ్చినమాట నిలుపుకునేందుకు నారదుడుపడ్డ తంటాలు ఇన్నీ, అన్నీ కావు. కొన్నాళ్ళకు తిరిగి మహోదరుని వద్దకు వచ్చాడు. నారదుని చూడగానే మహోదరునిలో ఆశ పెల్లు బికింది. 'నా మనోహరి కన్పించిందా? ఎక్కడ.... ఎక్కడున్నది మహర్షీ....' అంటూ ఆదుర్దాగా ప్రశ్నించాడు.

'ఇంకెక్కడుంటుంది! ద్వారకలో శ్రీకృష్ణుని అంతఃపురంలో వుంది. కళ్ళారా చూశాను....' అన్నాడు నారదుడు.

'ఇది నిజమా!' అన్నాడు మహోదరుడు.

'చూసిన మాట నిజం. కానీ అవిడే నీ మనోహరి అని నే నెలా చెప్పగలను? కొత్తగా వచ్చింది. అతిలోకసుందరి. పేరు వసుంధర....'

'నారదా! మీరింకేం చెప్పనక్కర లేదు. ముమ్మాటికీ అవిడే నా మనోహరి. ఒక్క దెబ్బకు రెండు పక్షులు. సర్వ సైన్యంతో వెళ్ళి ఆ కృష్ణుని హతమార్చి నా మనోమోహినిని రక్షించు కుంటాను....'

'మహోదరా! ఇలా ఆర్భాటంగా వెళితే శ్రీకృష్ణుడు నీ రాక పసిగట్టి వసుంధరను అక్కడ నుండి దాటవేయవచ్చు....

'ఆఁ....దాట వేస్తాడా!....'

'కాకపోతే తీసుకెళ్ళి పెళ్ళాడమని నీ కప్పగిస్తాడా!....ఇదిగో చూడు. నీకు దివ్యవిమానం కలదుగా! అర్ధరాత్రిపూట అంతా నిద్రలో వుండగా వెళ్ళి చడీచప్పుడు లేకుండా పని చక్కబెట్టు కొనిరా!....' అని సలహా యిచ్చాడు నారదుడు.

'సమయ సంజీవిలా వచ్చి చక్కని ఉపాయం చెప్పారు....' అంటూ నారదుని ప్రస్తుతించి విమానంలో బయలుదేరాడు మహోదరుడు.

అర్ధరాత్రి సమయం-అంతా నిశ్శబ్దంగావుంది....మహోదరుని విమానం శ్రీకృష్ణుని అంతఃపురోద్యాన వనంలో వాలింది. మహో దరుడు క్రిందికి దిగి పరిసరాలను పరికిస్తూ రెండడుగులు ముందుకు వేశాడు. ఇంతలో.....ఒక శోకగీతం వాని చెవిని పడింది. మహోదరుడా వైపుకు నడిచాడు. సంగీత విశారదుని రూపంలో వున్న ఒక వృద్ధుడు కనిపించాడు. ఎందుకలా ఏడుస్తున్నావని వానిని ప్రశ్నించాడు.

'ఎందుకేమిటి? నా కూతురు వసుంధరను కృష్ణుడు చెర బట్టాడు. విడిపించుకోలేక ఏడుస్తున్నా' అన్నాడా ముదుసలి.

వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది మహోదరునకు.

'వసుంధర నీ కూతురా!—' అన్నాడు ఆశ్చర్యంగా.

'అవును, నాకున్నది ఒక్కగా నొక్క కూతురు. ఆవిడేమో యవనస్రమాట్టు మహోదరునకు మనసిచ్చిందింది. విడిపించుక పొయ్యేందుకు అతగాడు ఆఘోరిస్తాడేమో తోడు పడదామని, కాపేసుక కూర్చున్నా! ఏం ప్రయోజనం .... వాడొచ్చేనా! చచ్చేనా!....' అన్నాడు బిగ్గరగా వృద్ధుడు.

'చాందసుడా! గోల చెయ్యకు, నేనే మహోదరుణ్ణి!'

'అఁ....నీవా! పాపాత్ముడా! ఇన్నాళ్ళు నా కూతుర్ని విర హంతో ఏడిపించి యిప్పుడొచ్చావ్!'

'ఏంచెయ్యను మామా! ఆచూకీ తియ్యడంలో ఆలస్య మయింది. క్షమించి వసుంధర ఎక్కడుందో చెప్పండి. వెళ్ళి రక్షించుకుంటాను.'

'సరి-సరి, చడీచప్పుడు లేకుండా యిలా వెళ్ళి కుడి వైపు మలుపు తిరుగు. లతా మంటపం కన్పిస్తుంది. దానిలో శోకిస్తూ వుంటుంది....' అన్నాడు విశారదుడు.

వెంటనే లతా మంటపం చేరుకున్నాడు మహోదరుడు. విశా రదుడు చెప్పినట్లుగానే అచ్చట శోకిస్తూవున్నది వసుంధర. ఆమె కెదురుగా మహోదరుని పేరు మట్టి గడ్డలతో తీర్చబడివుంది. మహోదరుడది చూశాడు. ఆమె తన్నే ధ్యానిస్తున్నదని తల పోశాడు. అప్రయత్నంగా 'ప్రేయసీ!' అన్నాడు.

'ఆఁ....మీరా! ఇన్నాళ్ళకు జ్ఞాపకం వచ్చానా? నయమే! ఇప్ప టికైనా వచ్చారు. మళ్ళీ ఆ పాపిష్టి కృష్ణుడి కంటబడితే ప్రమాదం! బయలుదేరండి....' అని తొందర పెట్టింది వసుంధర.

'మరి మీ నాన్నో!' అన్నాడు మహోదరుడు.

'నే నెక్కడుంటే అక్కడికే వచ్చి వాల్తాడు మానాన్న! కాంతకు, కాంతుడికి కావలసింది ఏకాంతం....ఊఁ! పదండి....! అన్నది వయ్యారం వొలికిస్తూ వసుంధర.

'అబ్బబ్బ ఏమొచ్చినా పట్టతరం కాదు నీకు!....' అంటూ ఆమెను తీసుకొని విమానంలో బయలుదేరాడు మహోదరుడు!

పాపం-అమాయకుడు! తన వెంట వచ్చినది వసుంధర రూపంలో వున్న తన ప్రత్యర్థి శ్రీకృష్ణుడని వాడికేం తెలుసు! అప్పుడు తెలియక పోవచ్చు. ఎప్పుడో ఒకప్పుడు తెలియాలిగా! తెలియగానే ఏం జరిగింది? వనంలో కనుపించి వసుంధర ఉనికి చెప్పిన వృద్ధ విశారదుదెవరు? ఎవరైనది తెలుసుకునేందుకు బుర్ర బ్రద్దలు చేసుకోవడమెందుకు?

చిత్రం చూస్తే సరి....!



# రంగ రంగ వైభవం

రాజ సభకు వెళ్ళే ముందు, రాణులందరూ శ్రీకృష్ణుని అలం కరించడం ఆచారం. శ్రీ వారికి అదో ముచ్చట. ఆ ముచ్చట చూడాలని కుతూహల పడింది వసుంధర. చడీ చప్పుడు లేకుండా కృష్ణ మందిరం ప్రవేశించింది. స్థంభం మాటున జేరి స్వామి శోభను, అనిర్వచనీయమైన ఆనందంతో అదే పనిగా చూడ సాగింది. రమణీ మానస చోరుడైన రాజీవనయను డది గమ నించాడు. చిరుదరహాసం విసిరి చిన్నారి వసుంధరను పరవశింప జేశాడు. అలంకారం పూర్తి అయింది. అద్దం స్వామి వారికి చూపింది జాంబవతి. 'మెరుగు టద్దమును మించు సత్య చెక్కిలి వుండగా ఈ అద్దమెందులకు?' అంటూ గంధపు చేతితో సత్యా దేవి చెక్కిలి నిమిరాడు శౌరి. అంత మందిలో ఆ అదృష్టం తన కబ్బినందుకు తనలో తాను మురిసి పోయింది సత్య. ఆ అను భూతిని తన కన్వయించుకొని తన్ను తానే మరచి పోయింది వసుంధర. సతుల వద్ద సెలవు గైకొని సభకు బయలుదేరాడు శ్రీకృష్ణుడు. నియమం మరచి నీలమేఘశ్యాముని వెంటబడింది వసుంధర. ఆ దృశ్యం రుక్మిణీదేవి కంట బడింది. కంగారుగా వెళ్ళి వసుంధరను పట్టి ఆపింది. నల్లనయ్య అది గమనిం చాడు. కాని....గమనించనట్టే వెళ్ళిపోయాడు.

తన్ను మించిన సౌందర్యవతి లేదని విర్రవీగే సాత్రాజితి వసుంధర సోయగం జూచి చకితురాలైంది. ఆ సుందరి కంట బడితే స్వామి తనకు దక్కడని భావించింది. 'అక్కా! నారదుల వారు నీ మందిరంలో వుంచి వెళ్ళినది ఈ సుందరి నేనా!' అని రుక్మిణీదేవిని ప్రశ్నించింది. రుక్మిణి 'అవునన్నట్టు తల వూపింది.

'ఈవిడ నీవద్దనే వుంటే నీవు నారదున కిచ్చిన మాట నిలుపు కోవడం కల్ల. నా మందిరానికి పంపించు. అన్నీ నే జూసు కుంటా!' అని రుక్మిణీదేవికి నచ్చజెప్పి తగు జాగ్రత్త కోసం వసుంధరను తన వెంట తీసుకు వెళ్ళింది సత్య. ఆ తర్వాత వూర కుంటుందా! ఎన్నో కట్టుదిట్టాలు చేసింది. ఎన్ని జేసినా తన భయం తనకుండనే వుంది,

నాడు వైశాఖ పూర్ణిమ. యాదవులందరికీ పర్వదినం. భవానీ ఉత్సవాలు రంగ రంగ వైభోగంగా రైవతకాద్రిలో జరుపుకుంటూ రానాడు. స్వామివారి ఆధ్వర్యంలో జరిగే ఆ సంబరం తిలకించాలని సంబర పడింది వసుంధర. సత్య అందుకు అంగీకరిస్తుందా? 'నీవు ఆ కొండను ఎక్కనూలేవు, ఆ ఎండకు ఓర్చుకోనూ లేవు. నా మాట విని నీ విక్కడే వుండు' అని కల్లబొల్లి మాటలు చెప్పి, మరింత కట్టుదిట్టంజేసి మాధవు నితో రైవతకాద్రికి బయలుదేరింది.

నిజంగా రంగరంగ వైభవంగానే జరిగాయి వేడుకలు. గోప భామినులు 'జేజేల తల్లికీ జేజేలు, మా గౌరమ్మ పెళ్ళికి బాజాలు' అంటూ ఆడి, పాడి, ఆదిశక్తిని అలరించారు. ఉత్సవ సంరంభం పూర్తి అయింది. మళ్ళీ ప్రయాణ భేరీ మ్రోగేవరకు ఎవరి యిష్టం వచ్చిన వినోదాల్లో వారు ఆనందంగా గడపవచ్చునని ప్రకటిం చాడు బలరాముడు. వినోద ప్రియులైన యాదవులకు ఆ ప్రక టన అమందానంద దాయకమైంది. చెట్ట పట్టాలేసుకుంటూ చెట్టు కొాక జంటగా నలుమూలలా చేరిపోయ్యారు.

శ్రీకృష్ణుడు అష్ట భార్యలతో మిగిలి పోయ్యాడు. ఎనమండు గురు దేవేరులలో ఎవరికి దక్కవలె స్వామివారి ఏకాంత సేవ? రుక్మిణి మినహా అందరూ నా కంటే నాకని పోటీ పడసాగారు.

చెండు చెలగాటంలో ఎవరు గెలిస్తే వారిదే ఆ భాగ్యం! అన్నాడు నందగోపాలుడు. అంతా 'సై' అన్నారు. మోహన కృష్ణుని మురళీగానంతో ఆట ప్రారంభమైంది. రుక్మిణీదేవి వేడుక చూస్తూవుంది. సతులందరిని పేరుపేరునా కవ్వించి నవ్విస్తూ, నవ్వించి కవ్విస్తూ అతి చాకచక్యంతో ఆట నడుపుతున్నాడు మాధవుడు. చివరకు సత్యభామ, లక్షణ యిద్దరే మిగిలారు. ఏలాగైనా విజయం తనకే దక్కాలన్న పట్టుదల యిద్దరిలోనూ కన్పిస్తున్నది. పోటా పోటీలతో ఆట సాగుతున్నది. ఉత్సాహంతో ఉరకలేస్తున్నది లక్షణ. ఆవేశంతో అలసిపోయింది సత్య. అంతా గెలుపు లక్షణదే నన్నారు. ఆ మాట సత్యకు అశని పాతమైంది. జాలిగా స్వామివంక చూసింది....ఎంతైనా స్వామి సత్యావిధేయుడు గదా! ఏదో మాయ చేశాడు. లక్షణ కాలు జారింది....గెలుపు సత్యకు దక్కింది. విజయ గర్వంతో విభుని-తన వెంట తీసుకువెళ్ళింది. అందరూ చూస్తుండగనే అందమైన పొదరింటిలో దూరిందా జంట. స్వాతిశయంతో పొంగిపోయిన సత్య స్వామి ఒడిలో వాలిపోయింది. అల్లరి కృష్ణుడు మిన్నకుంటాడా? మెల్ల మెల్లగా ముంగురులు నిమిరాడు. పట్టరాని ఆనందంతో ఆమె యిలా అన్నది. "స్వామీ మీ సాయమే లేకపోతే నేడు నాకీ భాగ్యం దక్కేది గాదు."

'సత్యా! ఇందులో నే జేసిందేముంది? నీ సౌందర్యమే నా చేత అలా చేయించింది.'

'అయితే....లోకంలో నాకంటె అందగత్తెలు లేరంటారా? స్వామీ!'

'నే నననం కాదు. ఒకనాడు బ్రహ్మదేవుడే నాతో అన్నాడు-సృష్టిలోనే నీవంటి సౌందర్యవతి లేదని.'

సత్యకు అమృతోపమానమైనదామాట. ఆ ఆనంద పారవశ్యంలో ఆత్మేశుని కళ్ళలోకి చూస్తూ అలాగే కన్నులరమోడ్చింది. అంతే! తియ్యని కలలలో తేలియాడింది. ఉన్నట్టుండి స్వప్న భంగమైంది. దిగ్భ్రాంతితో 'స్వామీ! స్వామీ!' అంటూ పైకి లేచింది.

పూల పాన్పుపై స్వామి కన్పించలేదు.

ఒక్క క్షణం అక్కడ వుండలేకపోయింది. స్వయంసారధ్యంతో రథంలో బయలుదేరింది. ఆమె మనసు మనసులో లేదు. తేరుబృందావన ముఖద్వారం సమీపించింది.ఇంతలోవిభుని గొంతు వినిపించింది. క్రిందికురికి వనంలో ప్రవేశించింది. ఆమె కంటబడిన దృశ్యం....తన స్వామి వలపు లాలనలో తరించిపోతున్న వసుంధర. ఆమెలో ఆవేశం పొంగిపొరలింది. భూమి గిరగిర తిరిగి నట్లయింది....ఇంతలో 'స్వామీ! ఎన్నటికీ నన్ను విడువరుగా?'అన్నది వసుంధర.

'నిన్నా?....ఎన్నటికీ విడువను వసూ!'

'మరి....జాణగారు వచ్చిన?'

'జాణా?....ఓ సత్యభామా? ఏం వచ్చిన? నాకు భయమా? ఎవరు వచ్చినా నిన్ను విడువను వసూ!' అంటూ వసుంధరను కౌగిలిలో హత్తుకున్నాడు శ్రీకృష్ణుడు.

సత్య యిక సహించలేక పోయింది. తోక త్రొక్కిన త్రాచులా బుస కొట్టింది. ప్రళయకాల చండివలె గర్జించింది. రుప్పించి వారి ముందు దూకింది. ఆ తర్వాత ఏం జరిగింది?....

చాలాచాలా జరిగింది. ఆ జరిగిందేమిటో........

తెరపై చూడండి.



# కల్ల దేవుడు:

అనగా అనగా ఒక రాజు. అతని పేరు పౌండ్రక వాసుదేవుడు. ఆచార వ్యవహారాలన్నిటిలోనూ శ్రీకృష్ణుని అనుకరిస్తూ వుంటాడు. ఆ అనుకరణ ఆరని పగతోనేగాని, అభిమానంతో కాదు. శ్రీ కృష్ణునకు పోటీగా కృత్రిమ శంఖ చక్రములు ధరించి తానే నిజమైన వాసుదేవుడనంటాడు. అనడంతో సరిపెట్టుకో లేదు. ప్రజలందరూ తన్ను అవతార దేవునిగా అంగీకరించి, ఆరాధించాలని శాసనం చేశాడు. అంతే గాదు. పొరపాటున గూడా ఎవ్వరూ శ్రీ కృష్ణుని వాసుదేవుడని వ్యవహరించ రాదని కట్టడి విధించాడు. ఎదురు తిరిగిన వారినందరినీ గుది బండలు వేసి యమబాధలు పెడ్తూ వున్నాడు....ఇదీ వాని కథ!....

అది పౌండ్రకుని దర్బారు. సింహాసన వేదిక బ్రహ్మోత్సవం నాటి గర్భ గుడివలె చిత్ర విచిత్రంగా వుంది. పౌండ్రకుడు దేవతా మూర్తివలె అలంకరించుకొని కొలువుదీరి వున్నాడు. వాని కిరు వైపులా భక్త రాజాలు, భక్త పౌరులు, అంజలి బద్ధులై బారులు తీర్చి నిల్చొని వున్నారు. శ్రీమత్ పౌండ్రక వాసుదేవ చరణం-చరణం-సర్వజనాళికి శరణం....శరణం....అని స్తోత్రం జేస్తూ అర్చకామాత్యుడు పాదపూజ జరిపి తీర్థం సభికులకు పంచి పెట్టాడు. అంతా చేదు మింగినట్టు సేవించారు తీర్థాన్ని. అంద రికీ అర్చావతారాలు అనుగ్రహించమని పౌండ్రకుడు అర్చకామా త్యుని ఆదేశించాడు. భజ—భజ....అంటూ అర్చకామాత్యుడు విగ్రహాల తట్ట చేతికి తీసుకున్నాడు. ఇంతలో....సైన్యాధిపతి ఒక బడుగు బాపని భార్యా బిడ్డలతో సహా బంధించి సభకు తీసుక వచ్చి భో....భో....భగవాన్! ఇంటికి తీసుకెళ్ళి యిచ్చిన

తమ అర్చావతారాలను విసిరి వీధిలో గొట్టారు వీళ్ల....అని విన్నవించాడు. ధిక్....ధిక్....సకుటుంబ శాసన ధిక్కారమా! ప్రభంజనా! ఈ పొగరుబోతుల నక్కడి కక్కడే కాళ్లు, చేతులు గట్టి కారాగారమున పడవేయక మా సమక్షమునకు కొనివచ్చితివా?

"క్షమించండి భగవాన్! కారాగారాలన్నీ, కాలు మోపడానికి వీలులేకుండా నిండి వున్నాయి అభక్తులతో."

"అయిన.... తక్షణం ధన ధాన్య వస్తువాహన సమేతంగా వారి యావదాస్తినీ స్వాధీనము చేసుకొనుము."

వారికున్న ఆస్తల్లా అస్తికలే భగవాన్! చూడండి. వాళ్ళ, వాళ్ళ అవతారాలు....ఎలా వున్నారో!

పౌండ్రకుడా ఎముకల గూళ్ళను ఎగా దిగా జూచాడు. ఎవడీ దరిద్ర నారాయణుడు? అన్నాడు.

వీడే భగవాన్! కుచేలుడు.

ఆఁ! కుచేలుడా! ఆలు బిడ్డలు ఆకలితో అలమటించి చస్తున్నా అహో రాత్రాలు, ఆ యదుకృష్ణుని భజనలో ఒళ్ళు మరచి కూచునే వెర్రి బాగుల కుచేలుడా?....ప్రభంజనా! అవశ్య మిట్టి మూఢ భక్తులు మన పక్షమున వుండుట మంచిది.

మంచిదనే చెవినిల్లు గట్టుకొని ఎంతగానో బోధించాము. అణు మాత్రం మారలేదు.

ఆఁ!....మూఢ భక్తులు అంత సులభంగా మారరు. మారారో....ఇక మారడమంటూ వుండదు. ఏమంటావ్ అర్చ కామాత్యా? భజ....భజ....అంటూ పంత పాడాడు అర్చకా మాత్యుడు.



మాఆచారం .....
కల్యాణం పూర్తి అయ్యే వరకు కన్యాదాత
వధూవరువిద్దరి ప్రక్కనా కూర్చోవాలి

S.V.C.R

పౌండ్రకుడు క్షణ కాలం ఏదో ఆలోచించాడు. సింహాసనం నుండి పైకి లేచాడు. అచ్చటి నైవేద్య పళ్ళెరంలోని లడ్డు కొన్ని తీసుకున్నాడు. కుచేలుని పిల్లల్ని సమీపించాడు. బాలలూ! ఇవన్నీ మీకే! తీసుకోండి....అంటూ తలా ఒకటి యిచ్చాడు. ఆకలితో నకనక లాడుతున్నా, అభిమాన ధనులైన ఆ పిల్లలు, మాకు మీ లడ్లూ వద్దు, విగ్రహాలూ వద్దు. మేం మిమ్ము పూజించం. పూజించమంటే పూజించం....అని విసిరి కొట్టారు. ధిక్! ధిక్! కుచేలా! నీ చాందసంతో పిల్లల్ని కూడా పాడు చేశావే! భక్తిభావం యిప్పుడబ్బకపోతే యింకెప్పు డబ్బుతుంది? ఎంత సేపూ నీ మూర్ఖత్వం నీదే గాని, ఒక్క నాడైనా వారి భవిష్యత్తు ఆలోచించావ్!

"అయ్యా! ఎవరి భవిష్యత్తుకు ఎవరు కర్తలు? అన్నిటికీ ఆ జగద్రక్షకుడు శ్రీ కృష్ణపరమాత్మే వున్నాడు"-

"ఆఁ! ఉన్నాడు-ఉన్నాడు. మూఢభక్తి పిత్రార్జితంగా తన్నే నమ్మి సేవిస్తున్న నిన్నూ, నీ కుటుంబాన్ని నిత్య దరిద్రానికి ఆహుతిజేసి నిరంతరం గోప భామినీకేళీ కలాప విలాసాల్లో మునిగి తేలుతున్నాడు ద్వారకలో."

"అపచారం.... అపచారం.... లీలామానుష వేషధారియగు వాసుదేవుని మానవ మాత్రునిగా గణించి తూలనాడడం మహాపచారం."

ధిక్! ధిక్! నీ అతి మూర్ఖంతో మా సహనాన్ని పరీక్షించకు. ఆ మహాసాధ్వి ముఖం చూసి వూరుకున్నాను-అంటూ పౌండ్ర కుడు కుచేలుని భార్యను సమీపించాడు. ఏమమ్మా! భర్త తప్పు దారినపడితే తిప్పుకోవలసిన బాధ్యత భార్యది కదూ! ఆ యాదవుని నమ్ముకొని బావుకునే దేముంది? మీకు అష్టైశ్వర్యాలు అను

గ్రహిస్తాను. మా దైవత్వాన్ని అంగీకరించమని చెప్పు- అని ఆశ పెట్టాడు. పతివ్రతా తిలకమైన వామాక్షి ప్రలోభానికి పాల్పడి పతి మార్గానికి అడ్డుపడుతుందా!....

పౌండ్రకా! ఎంత కటిక దరిద్రంతో బాధ పడుతున్నా ఐశ్వర్యం కోసం ఆత్మ నమ్ముకోవడం నేను కాదు గదా, కపి గందులైన నా బిడ్డలు గూడా సహించరు-అని జవాబిచ్చింది.

సహించరా! అయిన మేమునూ సహించము. కుచేలా! ఆఖరు సారిగా అడుగుతున్నాను. మా దైవత్వం అంగీకరిస్తావా? లేదా?

కుచేలుడు పౌండ్రకుని మూర్ఖత్వానికి లోలోన నవ్వుకున్నాడు. కంఠంలో ప్రాణముండగా నీవంటి కల్లదేవుల గొల్పుట కల్ల.... కల్ల ....కల్ల ....అన్నాడు.

పౌండ్రకుడు ఆగ్రహావేశుడైనాడు. ప్రభంజనా! ఇక ఉపేక్షించరాదు. ఈ శనిగ్రహాన్ని సకుటుంబముగా అశ్వశాలలో బంధించు - అని ఆదేశించాడు. ఆ తర్వాత ఏమైంది?....చిత్రంలో శ్రీకృష్ణుని ద్వారా తెలుసుకొండి.

# దీనబాంధవుడు

అవని రక్షింప వాసుదేవులం మేముండగా పొగరు మీరి నీవు మా పేరు వహించి మా బిరుదములు ధరించి, మా ఘనతను ధిక్కరిస్తున్నావు. ఇప్పటికైనా తరతమ భేధమును గ్రహించి మా సమక్షమునకు వచ్చి, నీ నామము విసర్జించి, శంఖ చక్ర గదా ఖడ్గాది బిరుదములు త్యజించి శరణు కోరి చేరి సేవించిన సుఖముగా బ్రతుకగలవు. లేదా—యుద్ధమునకు సిద్ధపడక తప్పదు....ఇది....శ్రీ కృష్ణునకు పౌండ్రక వాసుదేవుడంపిన శ్రీముఖం—

నిండు పేరోలగంలో శ్రీ కృష్ణుని సముఖమున శ్రీ ముఖం పఠించాడు పౌండ్రక దూత. చిరునవ్వుతో స్వీకరించాడు శ్రీ కృష్ణుడు. ఇంతలో తననెవరో కొరడాతో కొట్టినట్లనిపించింది. ఏమిటా? అని దివ్య దృష్టిని ప్రసరించాడు. అశ్వశాలలో స్థంభానికి కట్టివేయబడియున్న కుచేలుని అదే పనిగా కొరడాతో బాదుతున్నాడు పౌండ్రకుడు. కుచేలుడు దెబ్బ దెబ్బకు "కృష్ణా!" "కృష్ణా!" అంటూ బాధ భరిస్తున్నాడు.

"నేను కల్ల దేవుడనా? ఊ....అను....పౌండ్రక వాసు దేవాయనమః అను....అనవా?....సరి నీ అంతు తేలుస్తాను...." అంటూ మళ్ళీ పశువును బాదినట్లు బాదాడు పౌండ్రకుడు. ఆ సంఘటన మహాసాధ్వి వామాక్షి గుండెను కలచి వేసింది. చేయునది లేక బావురుమని విలపించింది. అంతా మనోనేత్రంతో తిలకిస్తున్న శ్రీ కృష్ణుడు అభయ హస్తంతో కుచేలుని ఆశీర్వదించాడు....ఇదంతా....పాపం బలరామునికేం తెలుసు? "కృష్ణా!

ఏమిటి? అంత ఆలోచనలో పడ్డావు?" అన్నాడు తమ్ము నుద్దే శించి. ఆ మాటతో శ్రీ కృష్ణుడు తేరుకున్నాడు. "రాయబారీ! మీరేని అభిమతం మేరకు, వారి సన్నిధికే వచ్చి ఆయుధ విస ర్జన గావిస్తామని చెప్పండి!" అన్నాడు.

"తమరెప్పుడో రావడంగాదు. పౌండ్రక పౌర్ణమినాటి రాత్రి సరిగ్గా రెండు జాములకు లగ్నం నిర్ణయించారు మా భగవానులు. తద్దినానికి మీరక్కడుండాలి!"

"సరి సరి. తద్దినానికే రాగలం! వెళ్ళి చెప్పండి!" అంటూ చాలించాడు శ్రీ కృష్ణుడు.

పౌండ్రకుని తద్దినం రానే వచ్చింది. అన్న మాట ప్రకారం ఆయుధ విసర్జన గావించేందుకు అనుంగు మిత్రుడు వసంతకు నితో బయలుదేరాడు అచ్యుతుడు. రథం రైవతకాద్రి మీదుగా పోతున్నది. ఉన్నట్టుండి "కృష్ణా! ప్రేమ మయా! నా జీవితము నీకంకితము! నీవే నాకు ఆలంబనము!" అన్న ఆర్తనాదం విని పించింది. ఆ గొంతుక ఎవరిదోగాదు. తన చిన్నారి వసుం ధరదే!....

ఒక్క క్షణం ఆలోచించాడు. అభం శుభం తెలియని అమా యకురాలు వసుంధర....ఆమె మనసును తనే కదలించాడు. కలలు రేపి తనే ఆమెను కరగించాడు. తనే ఆమెలో వలపు రేకెత్తించాడు. వాస్తవం తెలియని సత్య వసుంధరపై పగ బూనింది. తత్ఫలితంగానే వసుంధర భూగర్భ గృహంలో బందీ అయింది. అచ్చటనుండే ఆమె విలపిస్తున్నది. తక్షణం ఆమె కంట బడటం తన ధర్మంగా భావించాడు. రథం నిలిపి క్రిందికి దిగబోయాడు. ఇంతలో...."కృష్ణా! దయాసాగరా! నా జీవితము నీకంకితము! నీవే నాకు ఆలంబనము!" అన్న కుచేలుని దీనాలాపం వారి చెవిని పడింది. కుచేలుడు తన బాల్య

మిత్రుడు మాత్రమే కాదు, నిరంతరం లేమితో సతమతమౌతూ గూడా, తన్నేమీ అడుగక నమ్మిన భక్తాగ్రేసరుడు! తన మూలంగానే బందీ అయ్యాడు. పౌండ్రకుడు పెట్టే బాధలు భరించ లేక, రక్షించమని ఎలుగెత్తి ఘోషిస్తున్నాడు. వెళ్ళి రక్షించడం తన విధి గదా!....ఒక వైపు వసుంధర....వేరొక వైపు కుచే లుడు. ఇద్దరూ తన్ను ఆరాధించే వారే! ఒకరిది నిష్కళంక ప్రేమ ....ఒకరిది అకలంక భక్తి! ఏది ముఖ్యం? ఈ ప్రశ్నకు సమా ధానం దొరకడం కష్టం....రెండూ ముఖ్యమే; అయినా ఆ దీన దయాళుడు ముందు కుచేలుని చెర విడిపించడం అవసరమని భావించాడు గాబోలు....రథం ఆ వైపుకే మళ్ళింది.

పౌండ్రకుని సభాభవనం పరమ కోలాహలంగా ఉంది. ఆయుధ విసర్జనకు అన్ని ఏర్పాట్లు పూర్తి చేసి అంతా శ్రీకృష్ణుని రాక కోసం ఎదురు చూస్తున్నారు. ఇంతలో ముహూర్త గంట గణ గణ మ్రోగింది. సమయానికి సభలో సాక్షాత్కరించాడు శ్రీ కృష్ణుడు. అంతవాడు తన్నారాధింప వచ్చినాడని తెగ మురిసి పొయ్యాడు పౌండ్రకుడు. మందహాస పూర్వకంగా తలపంకిస్తూ "యదుభక్తా! వచ్చితివా?" అన్నాడు.

"అవును. పని గట్టుకొని నీవు కోరిన విధంగా ఆయుధ విసర్జనజేయు పనిమీద వచ్చితిని."

"మెచ్చితిమి. మెచ్చితిమి."

"అది సరి. ఇది వినుము. నా వద్ద నాలుగు ఆయుధము లున్నవి. అందు నీకెయ్యది యిష్టమో చెప్పుము."

"భక్తా! మా కట్టి పట్టింపులు లేవు. అన్నియూ విడువ వలసి నవే కదా! నీ యిచ్ఛ వచ్చిన క్రమమున విడువ వచ్చును."

"పౌండ్రకా! నేనడుగునది అది కాదు. నీకు ఇచ్ఛామరణ మును ప్రసాదించు చున్నాను."

"ధిక్ ....ధిక్ ....ఏమది?"

"అదే! కౌమోదకీ గదచే నీ శిరమును ప్రక్కలు చేయ మందువా? ఖడ్గరాజమున కండలు తరుగమందువా? లేక-ధను ర్నిర్గత నిశాత నారాచములచే ఒడలు చిల్లులు పడచేయమందువా? కాదేని....సుదర్శనాయుధముచే కంఠలుంఠన మొనరించి సుఖ మరణమును అనుగ్రహించమందువా?"

ఆ మాటకు దిగ్భ్రమ చెందిన సభికులు 'ఎంత నమ్మక ద్రోహం!' అంటూ ఒకరి నొకరు చూచుకున్నారు. పౌండ్రకుని ఆవేశం కట్టలు త్రెంచుకొన్నది. పళ్ళు పటపట కొరుకుతూ ఇలా అన్నాడు:

"అభ ప్రుడా! నీ బూషరింపులు నా పద్దనా!....నువ్వెంత! నీ చక్రమెంత! నా ఒక్క ఆయుధ ప్రమాణమున్నవా నీ ఆయుధము లన్నియూ కలసి....చూడు నా చక్రం. రథ చక్రమంతమంద మున్నది. ఆవేశం రానిదే నేనైనా కదల్చలేను. ఇదిగో! ఇది మామూలు గద కాదు. వెయ్యి రకాల లోహాలు కరిగించి, కుదించి, దట్టించి చేయించాను. బరువులో పర్వత తుల్యం."

"అయిన-ఆలస్యమేల? గోల చాలించి పోరికి నిలువుము మ్రోల. చూతువు నా లీల"....అంటూ కౌమోదకిని చేత సంధిం చాడు శ్రీ కృష్ణుడు....

ఆ తర్వాత పౌండ్రవసుడు హాటుడగుటకు ఎంతసేపో పట్టలేదు. కుచేలునితో పాటు అనేకమంది సాధుసత్తుములు బంధవిముక్త లయ్యారు. అంతా అంజలి బద్ధులై ఆ దీనబాంధవునకు నివాళు

లర్పించారు. ఇంతలో వసుంధర వాసుదేవుని మదిలో మెదిలింది. వడివడిగా ద్వారక చేరుకున్నాడు. కానీ అప్పటికే పరిస్థితి చేయి దాటిపోయింది. భూగర్భ గృహంలోని వసుంధరను తన ఆగర్భ శత్రువు మహోదరుడు అపహరించుక పొయ్యాడు....పర్యవసానం ఆలోచిస్తూ పట్టమహిషి రుక్మిణీదేవి మందిరం ప్రవేశించాడు శౌరి. ఇదే అదననుకొని అదే సమయానికి అచ్చటికి వచ్చాడు నారదుడు. వచ్చినవాడు వూరకుంటాడా? "తల్లీ! రుక్మిణీదేవీ! ఎంత పని చేశావమ్మా! నీ చాటునుంటే నా బిడ్డ ఎవరి కంటా పడదని నీ కప్పగిస్తే చివరకు నా కంటనే పడకుండా చేశావే" అంటూ నానా గొడవ చేశాడు. పాపం. రుక్మిణి ఏం చెపుతుంది?

"మన్నించండి మహర్షీ! అంతా హఠాత్తుగా జరిగిపోయింది" అన్నది.

"మునీంద్రా? తప్పంతా నాది" అంటూ విచారం వ్యక్తం జేసింది సత్య.

"ఆహా! మీరుభయులూ తప్పు నాదంటే నాదని పోటీ పడ్డంత మాత్రాన నా గోడు తీరుతుందా? మీకు పదివేల నమస్కారాలు. నా బిడ్డను నాకు దక్కించండి" అన్నాడు నారదుడు.

ఆ పిమ్మట చిత్ర విచిత్రంగా అనేక మలుపులు తిరిగిన కథ చివరకు ఎలా ముగుస్తుందో....?

సకుటుంబముగా చిత్రం చూసి తెలుసుకోండి!





మీ మాట వినాలిగా!
మీరు పెద్ద జాణలుగా!!

# పాటలు

రచన: 1 పాడినవారు:

దాశరధి ఘంటసాల

నారధుడు: జయహే! నవనీలమేఘ శ్యామా!
వనమాలికాభిరామా!
నీ గానమ్ములో
ఈ లోకమ్ములే
పులకించు దేవ దేవ! ॥జయహే॥

వేదాల కొసలందు వెలుగొందు స్వామీ!
ప్రేపల్లెవాడలో వెలసినా వేమీ!
మానవుని దేవునిగ మలచనే కాదా!
ఔలె! సరేలె! భలే లీలలే! ॥జయహే॥

ఇలలోన ధర్మమ్ము నెలకొల్పనెంచి
యెన్నెన్నొ రూపాల యేతెంతు వీవు!
వేడినవారిని విడనాడ బోవు!
నిజం....నిజం....ముమ్మాటికిది నిజం! ॥జయహే॥

మధురం మధురం! అధరం మధురం!
అధరము సోకిన వేణువు మధురం!
నామం మధురం! రూపం మధురం!
పిలుపే మధురం! తలపే మధురం! నీవే మధురం!

రచన: 2 పాడినవారు:

డా॥ సి. నారాయణరెడ్డి సుశీల

రంభ: జోహారు! శిఖిపింఛమౌళీ! ఇదె
జోహారు రసరమ్య గుణశాలి! వనమాలి! ॥జోహారు॥

కలికి చూపులతోనె చెలులను కరగించి
కరకు చూపులతోనె అరులను జడిపించి
నయగార మొకకంట! జయవీర మొకకంట!
చిలకరించి చెలువుమించి నిలిచిన
శ్రీకర! నరవర! సిరిదొర! ॥జోహారు॥

నీ నాదలహరిలో నిదురించు భువనాలు
నీ నాట్యకేళిలో నినదించు గగనాలు
నిగమాలకే నీవు పిగబంతివై నావు
యుగ యుగాల దివ్య లీల నెరపిన
అవతారమూర్తి! ఘనసార కీర్తి ॥జోహారు॥

చకిత చకిత హరిణేక్షణా వదన
చంద్రకాంతు లివిగో!
చలిత లలిత రమణీ చేలాంచల
చామరమ్ము లివిగో!
ఝుళం ఝుళిత సురలలనా నూపుర
కలరవమ్ము లివిగో! మధు
కరరవమ్ము లివిగో! మం
గళరవమ్ము లివిగో!
దిగంతముల అనంతముగ గుబాళించు
సుందర నందన సుషుమ్మ లివిగో! ॥జోహారు॥

రచన: 3 పాడినవారు:

సింగళి సుశీల

వసుంధర: హాయి హాయి హాయీ!
ఏమిటో యీ హాయీ! ॥హాయి॥

కమ్మని పూవులు....ఘుమఘుమలు!
తుమ్మెద పాటలు రిమఝిమలు!
ఎగిరే పిట్టలు....తగిలే గాలులు!
కువకువలూ....గుసగుసలు!
కువ, కువ, కువ, గుస, గుస, గుస,
హాయ్ హాయ్ హాయ్ ॥హాయి॥

కొండల చుట్టూ కోనలు!
కోనల నడుమ యేరులు! ఆ
యేరులు ఒకటే గలగల: నా
ఎదలో ఏదో కలకల!
కల, కల, కల, గల, గల, గల,
హాయ్ హాయ్ హాయ్! ॥హాయి॥

నీలిమబ్బు దివి గప్పిందీ!
నెమలి పొంగి పురి విప్పింది! ఆ
నెమలి కన్నులా తళ తళలు! నా
కన్నుల నిండా కళ కళలు!
కళ కళలూ, తళ తళలూ!
కళ, కళ, కళ, తళ, తళ, తళ,
హాయ్ హాయ్ హాయ్! ॥హాయి॥

రచన: 4 పాడినవారు:

పింగళి సుశీల, S. V. రంగారావు

మాయావసుంధర:

ఆడించే జాణనె గానీ
ఆడుదానను కానే కాను!

మహోదరుడు: ఊఁ! ఆడు!

ఆమె: ఆటంటూ ఆడితినా

అతను: ఆ....ఆ....ఆ

ఆమె: ఆటంటూ ఆడితినా, నీ
అంతుచూడక మాననోయ్! ॥ఆడించే॥

అతను: అహ్హాహా! ఏమి విలాసం!

ఆమె: విలాసాల మాటకొస్తే నీవు చాలవోయ్
కులాసాగ ఒక్కటిస్తే పైకిలేవవోయ్

అతను: భలే! భలే!

ఆమె: చేయి చేయి గలిపినా! చిన్నచూపు విసిరినా
జిలిబిలై తేలిపొయ్యేవోయ్
తేలి తూలి రాలిపొయ్యేవోయ్! ॥ఆడించే॥

అతను: అహ్హాహ! ఏమి కలికితనం!

ఆమె: కలికి తనంలో గడుసుదనం!
మగువ తనంలో మగతనం!
దాగియున్న ఎలనాగను నేనోయ్!

అతను: ఆహోహ్హాహ!

ఆమె: ధిమితక! ధిమితక అన్నానంటే!
దిమ్మదిరిగి..................... నీ
దిమ్మదిరిగి కనుపుయ్యాలోయ్! ॥ఆడించే॥

రచన: 5 పాడినవారు:

ముదివర్తి కొండమాచార్య సుశీల, జానకి

గోపభామినులు:

జేజేల తల్లికి జేజేలు! మా
గౌరమ్మ పెళ్ళికి బాజాలు! ॥జేజేల॥
వల్లకాడే యిల్లని తెలిసి
కొల్లాయికె గతిలేదని తెలిసి
తెలిసి తెలిసి బైరాగిని వలచి
వలపు రుచిని నెలతలకు చాటిన ॥జేజేల॥
కొండ కొమ్ముపై వుండేనేమి
మొండీ జగమొండైతేనేమి
కన్నెపిల్ల కనికట్టు కట్టితే
కరిగి ఒరుగునని ఎరుకపరచిన ॥జేజేల॥
మక్కువ మాటలు ఒక చెలికైతే!
చక్కలి గింతలు వేరొక చెలికి!
చక్కలి గింతలు ఒక చెలికైతే
చెక్కిలి నొక్కులు ఇంకో చెలికి!
అక్కడ తానై! ఇక్కడ తానై!
లెక్కలేని గమ్మత్తులు చేసి
రాసకేళిలో రమణుల దేల్చే
మోహన కృష్ణుని ముద్దుచెల్లెలా! ॥జేజేల॥

రచన: 6 పాడినవారు:

డా॥ సి. నారాయణరెడ్డి సుశీల, ఘంటసాల

వసుంధర: పిల్లన గ్రోవి పిలుపు! మెల
మెల్లన రేపెను వలపు!

మమతలు దాచిన మనసు....ఒక
మాధవునికే తెలుసు! యీ
మా....ధవునికే తెలుసు!

శ్రీకృష్ణుడు: సుందరి అందెల పిలుపు! నా
డెందము నందొక మెరుపు!
నందకిశోరుని మనసు! రత
నాల బొమ్మకు తెలుసు! యీ
రతనాల బొమ్మకు తెలుసు!

వసుంధర: వెన్నమీగడలు తిన్నావట!
వెన్నెలలో ఆడుకున్నావట!
ఎన్నో నేర్చిన వన్నెకాడివట
ఏమందువో మరి....నా మాట!
ఏమందువోమరి నామాట

శ్రీకృష్ణుడు: వెన్నమీగడలు తిన్నది నిజము!
ఎన్నో నేర్చితి నన్నదీ నిజము!
చిన్నారీ! నీ కన్నుల బాసలు
వెన్నుని దోచిన ఆ మాట నిజము
వెన్నుని దోచిన మాట నిజము ॥సుందరి అందె

వసుంధర: ........................................ ॥పిల్ల

అందీ అందని అందగాడవని
ఎందరో అనగా విన్నాను
అందులోని పరమార్థమేమిటో
అలవోకగా కనుగొన్నాను!
అలవోకగ కనుగొన్నాను!

శ్రీకృష్ణుడు: ఎంతజేలవని అనుకున్నానో
అంత గడసరి తరుణివిలే

అష్ట భార్యలతో అలరేరాజును
చెంగున ముడిచిన చెలువవులే!
చెలువవులే! చెంగలువవులే! ॥పిల్లన॥

రచన: 7 పాడినవారు:

ఆచార్య ఆత్రేయ సుశీల, ఘంటసాల

వసుంధర: కృష్ణా!....కృష్ణా! ప్రేమమయా!
నా జీవితము నీ కంకితము
నీవే నాకు ఆలంబనము! ॥నా జీవితము॥
కన్నె మనసు కదలించితివి
కలలు రేపి నను కరగించితివి
వలపువిందు చవిచూడక ముందే
కలచివేసితివి! బ్రతుకే కథ చేసితివి! ॥నా జీవితము॥

కుచేలుడు: కృష్ణా!....కృష్ణా!....దయాసాగరా!
నా జీవితము నీ కంకితము
నీవే నాకు ఆలంబనము! ॥నా జీవితము॥
లేమిని వోర్చితిని....ని
న్నేమని అడుగక నమ్మితిని
నమ్మని వారలు పెట్టిన బాధలు
నీ లీలేనని భరించితిని....నా
శక్తికి మించిన పరీక్ష నీది....నీ
తృప్తికి చాలని భక్తియా నాది? ॥నా జీవితము॥

వసుంధర: ఇచ్చిన మనసు పసివాడక మునుపే
వచ్చి ఏలుకోవేమీ....స్వామీ
వచ్చి ఏలుకోవేమీ!

# పద్యములు

రచన: 1 పాడినవారు:

మల్లెమాల మాధవపెద్ది

మహోదరుడు:

అంచిత దీక్ష ఉగ్రతప మద్భుత రీతినొనర్చి శంభు మె
ప్పించెద! అప్రమేయవర భీకర శక్తుల నెన్నియేని సా
ధించెద! మృత్యువున్ గెలిచి తేజమునన్ చెలరేగి కృష్ణుని
ర్జించెద! సర్వయాదవుల చిచ్చునబెట్టి దహించి వైచెదన్!!

రచన: 2 పాడినవారు:

ముదివర్తి కొండమాచార్య ఘంటసాల

నారదుడు:

రత్నముల వంటి అష్ట భార్యలకు తోడు
సోయగము గల్గు ఇంకొక్క సుదతియున్న
ఆహా! నవరత్న హారమే అమరు నీకు
కాంచి తరియించు భాగ్యమ్ము కల్గునాకు!!

రచన: 3 పాడినవారు:

మల్లెమాల మాధవపెద్ది

మహోదరుడు:

అఖిల లోకాధి నాయక సమూహమ్మెల్ల
నా ఆజ్ఞ మీరక నడువ వలదె!

పేర్విన్నమాత్రాన భీకర రిపుకోటి
జారి నల్దిక్కుల పారవలదె!
సర్వ సర్వం సహా చక్రవర్ధకమైన
ధనము సర్వము నాకె దక్కవలదె!
అంగాంగ సౌందర్యములరు భామిను లెల్ల
చెలగి నా కౌగిట చిక్కవలదె!
నరసురాసుర యక్ష కిన్నరు లనంగ
నేల? ఈ చరాచర జగజ్జాల మెల్ల
జై మహోదర! జయ జయ జై యటంచు
అహరహమ్మును నన్నె కొండాడ వలదె!!

రచన: 4 పాడినవారు:
మల్లెమాల: సుశీల:
సత్యభామ:

సమర భూమిని ఒక కాంత శస్త్రఘాటి
కాగ జాలక, నీ చుట్టు మూగి నట్టి
సైన్యమును గాంచి గుండెలు చల్ల బడెనె?
లెమ్మ! విల్లందు కొమ్ము! రారమ్ము నరక!!

రచన: 5 పాడినవారు:
మల్లెమాల: పిఠాపురం
నరకాసురుడు:

భామను చాటు జేసుకొని భండన భూమిని నిల్వ, నీకు సి
గ్గేమియు లేక పోయినను యీ నరకాసురు డాడుదానిపై
ఏమని బాణ మేయగలడు? ఇంచుక పౌరుషమున్న, వేగ నీ
కోమలి చేతివిల్లు గయికొమ్ము ఎదుర్కొన రమ్ము ధీరతన్!!

రచన: 6 పాడినవారు:

మల్లెమాల ఘంటసాల

శ్రీకృష్ణుడు:

దురహంకారముతోడ త్రుళ్ళిపడుచున్ దుర్మార్గ కృత్యుండవై
ధరకే పీడగ దాపురించిన నినున్ దైత్యాధమా! నేడె మ
త్కర నిర్ముక్త సుదర్శనాయుధముచే ఖండించి,బృందారకుల్
పరికీర్తింపగ, ముజ్జగమ్ములకు సౌభాగ్యమ్ము సంధించెదన్!!

రచన: 7 పాడినవారు:

మల్లెమాల మాధవపెద్ది

మహోదరుడు;

ఓరీ యాదవ! నీ ప్రగల్భములు మాయోపాయ జాలమ్ము లీ
ధీరాగ్రేసరు ముందు చెల్లవుర! మద్దివ్యాస్త్ర శస్త్రాళిచే
నీ రూపున్ వెసమాపి, అక్కసున గుండెల్ చీల్చి, ఆ నెత్తుటన్
నారాణిన్ కలవాణి నిప్పుడె వసంత క్రీడ లాడించెదన్!!

రచన: 8 పాడినవారు:

మల్లెమాల ఘంటసాల

శ్రీకృష్ణుడు:

మరచినావేమొ నీయన్న మమ్మెదిర్చి
నిట్టనిలువున బూడిదైనట్టి విధము
అదియె నీకును అభిమతమైన యడల
గావు కేకలు చాలించి కదలి రమ్ము!!

| ............ | 9 | పాడినవారు: |
|---|---|---|
| .. ............ | | ఘంటసాల |

శ్లో॥ జయతు జయతు దేవీ! దేవ సంఘాభిపూజ్యా!
జయతు జయతు భద్రా! భార్గవీ భాగ్యరూపా!
జయతు జయతు నిత్యా! నిర్మల జ్ఞాన వేద్యా!
జయతు జయతు సత్యా! సర్వభూతాంతరస్థా!!

| రచన: | 10 | పాడినవారు: |
|---|---|---|
| మల్లెమాల | | ఘంటసాల |

శ్రీకృష్ణుడు:

అడిగితి నొక్కనాడు కమలాసను నీ అకలంక సృష్టిలో
కడు సొగసైన యట్టి కలకంఠి యెవర్తుక యంచు, వేరె న
న్నడుగగనేల! ముజ్జగము లందున అందము చందమందు, నీ
పడతుక సత్యతోడ సరివచ్చు తలోదరి లేదు, లేదనెన్!!

| రచన: | 11 | పాడినవారు: |
|---|---|---|
| మల్లెమాల | | ఘంటసాల |

శ్రీకృష్ణుడు:

రమణీ! నా తప్పు మన్నింపరానిదేని
రట్టు సేయక జడతోడ కొట్టరాదె?
అతివ! కపిదీర నీ బాహులతల నన్ను
పట్టి బంధించి, అదుపులో పెట్టరాదె!!

రచన: 12 పాడినవారు:

మల్లెమాల సుశీల

సత్యభామ:

చాలుం చాలును కట్టిపెట్టుమిక నీ చాతుర్యమున్, గుండెలో
జ్వాలాభీల దవాగ్నిరేపి పయిపై పన్నీరు జిల్కింతువా?
వేళాకోళము లాయె నా బ్రతుకు యీ విడ్డూర మేమందు? నే
వాలాయమ్ముగ నిన్ను నమ్మి చెడితిన్ వాచాల! పో!
పొమ్మికన్!!

రచన: 13 పాడినవారు:

మల్లెమాల ఘంటసాల

కుచేలుడు: ఆడుగకే ఎల్ల దీనుల నరసి బ్రోచు
కృష్ణ పరమాత్మ సేవ కంకిత మొనర్చి
నాడ! తనువును, జన్మ జన్మాలకేని
కల్లదేవుల గొల్చుట కల్ల కల్ల!!

రచన: 14 పాడినవారు:

ముదివర్తి కొండమాచార్యు ఘంటసాల

శ్రీకృష్ణుడు:

పనిపడి నీవు కోరినటు భట్టులలో పెను భట్టులైన నీ
జనముల మ్రోల ఆయుధ విసర్జన సేయగ నెంచి వచ్చితిన్

పౌండ్రక: మెచ్చితిమి.... మెచ్చితిమి

శ్రీకృష్ణ: అది సరి....ఇది వినుము

అనువుగ దేనినిన్ విడువమందువో ముందుగ నీవె దెల్పుమా?
ఘన తర చక్రరాజమున! ఖడ్గమునా? గదనా? ధనస్సునా?

............ 15 పాడినవారు:

................ మాధవపెద్ది

పౌండ్రక వాసుదేవుడు:

కృష్ణ వాసుదేవ! కేశవ! పరమాత్మ!
అప్రమేయ, వరద, హరిముకుంద!
మిమ్ము జూడగంటి, మీ కృప గనుగొంటి!
అఖిల సౌఖ్య పదవులంద గంటి!!

రచన: 16 పాడినవారు:

మల్లెమాల మాధవపెద్ది

మహోదరుడు:

భళిరె! మేల్మేలు మదిలోని భావమెల్ల
హోయి, హోయని రెండు వాక్యముల దెలిపి
ఇంచు విలుకాని మహిమ చూపించినావు
రమ్ము! కైవల్యపదవి నందిమ్ము చెలియ!!

రచన: 17 పాడినవారు:

ముదివర్తి కొండమాచార్య మాధవపెద్ది

మహోదరుడు:

పలువా! ప్రేలకు మింక పండినవి నీ పాపమ్ము లీనాడు! మత్
ప్రళయా భీల ప్రతాప వహ్ని నిదెనిన్ భస్మమ్ముగావించి! మేల్
భళిరే! వీర మహోదరా యనుచు విశ్వంబెల్ల కీర్తింప, యీ
కులటా దేహము నింద పూసెదనురా క్రూరాత్మ!
నీ బూడిదన్!!



"సర్వేజనాస్సుఖినోభవంతు"

ప్రచురణ :
శ్రీ గాయత్రీ ప్రెస్, విజయవాడ-3.
ఫోన్: 7064

ఎట్టి తపంబు జేసి జనియించిరో! యీ అలివేణు లెల్లరున్




సహాజా! నేనజరామరుడను
కాదు! చేవలేక...
చావురాక పడియున్న
జీవచ్ఛవానివి



కౌముదీ వారి

విశిష్ట పౌరాణిక చిత్రము

# శ్రీకృష్ణ విజయము

నిర్మాత...యమ్.యస్.రెడ్డి.

దర్శకత్వం...కమలాకర కామేశ్వరరావు